విస్తృతముగా అనుశీలించెను. కాని ధ్వన్యాచార్యుని తన్నిబంధరచనా ప్రవృత్తి ధ్వనిప్రస్థానప్రతిష్ఠాపనమునకై కావున నాత డచట భారతవిషయకచర్చను సర్వాంగీణముగా నొనర్ప నవకాశము చిక్కలేదు. అది ఈనాటికి శ్రీరఘునాథశర్మగారి ద్వారమున చక్కగా నెరవేరినది. ఈనిబంధ మాంధ్రభారతము నాధారముగా గొనినదేయైనను తదాంధ్రీకృతి శ్రీ వ్యాసభగవానుని రచనాతత్త్వానుయాయియే. కనుక నిది శ్రీమన్మహాభారతాశ్రిత మని సామాన్యముగ ననదగును. నన్నయభట్టారకుడును "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని " ఇత్యాది పద్యమున విష్ణుసన్నిభుడగు వ్యాసునిరచనలోని విశ్వజనీనత్వమును ప్రతిపాదించుచు తల్లక్షణములు చెడకుండ రచనగావించుటయే తనలక్ష్యమునని సూచించెను. మిగిలిన తిక్కన యెఱ్ఱనలును ఈమార్గమునే అనుసరించి రనుటచే సమగ్రాంధ్రభారతమును వ్యాసరచనకు సంగ్రహముగ నొసగిన యాంధ్రరూపమే.

ఈ నిబంధము తత్త్వాన్వేషాత్మకము. అన్వేషింపబడిన తత్త్వము ఏది? తస్యభావః - తత్త్వమ్. తచ్ఛబ్దముచే సచ్చిదానందస్వరూపమగు పరమార్థమే చెప్పబడును. భావమనగా రూపము. కనుక ఏవిశ్లేషణాత్మకనిబంధమునందైనను సాక్షాత్తుగనో పారంపరికముగనో పరమార్థతత్త్వ స్వరూపమే వివేచించబడును. శ్రీమన్మహాభారత మొక రసఖండము. "రసోవైసః" - "రసగ్ంహ్యేవాయం లబ్ధ్వాఽఽనందీభవతి"ఇత్యాది ప్రమాణములచే కావ్య ప్రతిపాద్యవిషయాస్వాదజనితానందము బ్రహ్మానంద సబ్రహ్మచారి. ఈయది ప్రత్యగనుభవ గోచరమే కనుక ఇది లేదనరాదు. కనుక 'అస్తి' 'సత్'. ఇది "నానృషిః కురుతే కావ్యమ్ "ఇత్యాది ప్రమాణములచే క్రాంతదర్శియగు ఋషితో నభిన్నుడగు కవియొక్క చిదంశమగు ప్రతిభచే నిష్పన్నము కనుక కార్యకారణముల కభేదముచే కావ్యానందము "చిత్". దాని వాస్తవస్వరూపము ఆనందము. కనుక నిట్లు కావ్య ప్రతిపాద్యవిషయాస్వాదజనితానందము సచ్చిదానందరూపము అనుట అపరిహరణీయమైనది.

మరియొక విధముగ నాలోచింపగా - పరమార్థతత్త్వము స్వస్వరూపమున యోగిమాత్రగోచరము; కాని సర్వులకును తద్వివర్త మగు జగద్రూపమున గోచరించుచున్నది. తద్విషయకవ్యవహార మంతయు వాక్కుతోనే జరుగవలెను. అందుచేతనే ఈదృశ్యజాతమంతయు నామరూపాత్మకమనుట. ఇది బాహ్య జగద్విషయము."అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః" ఇత్యాది ప్రమాణముల చేతను, యుక్తిప్రపంచము చేతను కూడ కవి స్రష్టయే.

ఈప్రపంచమును నామరూపాత్మకము. కాని బాహ్యసృష్టికిని కావ్యసృష్టికిని గల భేదమిది : బాహ్యసృష్టి యొక్క నామరూపాత్మకత్వములో రూపము దృష్టి గోచరమగుచుండును.

నామము - శబ్ద ప్రపంచము - వ్యవహర్తల ముఖమునుండి అంతలో పుట్టి అంతలో అనంతాకాశమున లయము నొందును. కాని కవిసృష్టి లోనో - తద్గ్రథిత వాగ్విసరము రచనాత్మకముగ స్థిరరూపమునొంది గోచరమగు చుండును. తత్ప్రతిపాద్యములగు విషయములరూపము మాత్రము సహృదయుల భావనాబలము నాశ్రయించి చిత్తగోచర మగుచు లయము నొందుచునుండును. శబ్దములు రూపములతో అవినాభావసంబంధము కలిగియుండి వానిని ప్రతిపాదించుచుండుట మాత్రము ఉభయత్రసమానము. శబ్దము ధ్వన్యాత్మకము. కాని భేరీపటహాదిధ్వనులకు అర్థప్రతిపాదకసామర్థ్యము లేదు. గవాదిశబ్దములకు అర్థప్రతిపాదనశక్తి కలదు. ఇట్లు శబ్దాత్మకధ్వని ప్రతిపాద్యమగు అర్థమును స్ఫుటము శబ్దాత్మకధ్వనిచే వ్యంజితము. తత్తచ్ఛబ్దప్రతిపాద్యములగు అర్థములు శ్రోతలకు ప్రతీతము లగుటలో ద్వార-సాధన-భూతము. ఈవిషయమున వైయాకరణులు వర్ణస్ఫోటము-పదస్ఫోటము - వాక్యస్ఫోటము అను మూడు ప్రధానభేదములను, మరియింకను తత్తదుపభేదములను విశ్లేషించి విషయవిస్తృతి నొనరించినారు, ఈమార్గమును కావ్యవిషయమున నన్వయించుటచే నిష్పన్నమైన సిద్ధాంతమే ధ్వని సిద్ధాంతము.

దానిని సంగ్రహముగా నిట్లు చెప్పవచ్చును :-

ప్రతిశబ్దమును తానొక యర్థమును సాక్షాచ్ఛక్తిచే ప్రతిపాదించును. దానిచే "గోవు" అను శబ్దము నుచ్చరింపగనే సాస్నాలాంగూల ఖుర విషాణా (గంగ డోలు - తోక - గిట్టలు - కొమ్ములు)ద్యవయవ సహితమగు ప్రాణిరూపము శ్రోతృమనోనేత్రమున గోచరించును. ఇచట "గోవు" అను శబ్దము వాచకము. ఈయర్థము 'వాచ్యము'. ఈశబ్దము ఈయర్థమును ప్రతిపాదించుటకు సహకరించిన శక్తి 'వాచకత' అథవా అభిధ.

"ఈబాలుడు అగ్ని" అందుము. ఈబాలుడు ఉన్నాడు. అగ్నిఉన్నది. కాని ఈవాక్యమునందు ఈఉభయమునకు గోచరించు అభేదము అసంభవము. కనుక ఈబాలునియందు "అగ్ని"యందలి "పవిత్రత" కలదు. అందుచే ఈవాక్యమున గోచరించు అభేదము ఉపపన్నము. ఈవిధముగ ఇచట "అగ్ని"పదము అగ్ని యందలి పావిత్ర్యమును లక్షింప - గుర్తింప - జేసినది. కనుక ఇచట 'అగ్ని' పదము లక్షకము. 'పావిత్ర్యము కలవాడు' అను అర్థము లక్ష్యార్థము. ఈపదము ఈయర్థమును ప్రతిపాదించుటలో సహకరించిన శబ్దశక్తి లక్షణ.

కాని ఈరెండుపద్ధతులకు అతీతముగా ఆ యా వాక్యములచేతను పదముల చేతను పదాంశములచేతను ఆయాసందర్భములందు సహృదయహృదయ చమత్కార జనకములగు అర్థములు స్ఫురించుచున్నవి. ఈయర్థములు పైని తెలిపిన స్ఫోట ప్రతిపాద్యార్థములతో

పోతిక కలవి. కాని వానికంటెను విలక్షణ మగునవి.

ఉదాహరణమునకు :-

" ఏవంవాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ" (కుమారసంభవము - 6.84)

ఇచట ఈశ్లోకమునందలి ఆ యా పదములకు గల అభిధాలక్షణాశక్తులచే ప్రతిపాద్యములగు అర్థములకంటె అతీతమై మరొక యర్థము గోచరించుచున్నది.

అది ఇట్లు :

దేవర్షియగు అంగీరసుడు హిమవంతునితో పార్వతిని శివున కిచ్చి పెండ్లిచేయు విషయమై ఈ (పై) విధముగ పలుకునప్పుడు తండ్రిపార్శ్వమున పార్వతి యధోముఖియై (నిలిచియుండి) లీలాకమలపత్రములను లెక్కించెను. హేతువేమై యుండును? అని ప్రశ్న. ఆమె కన్య; ముగ్ధ. కాని ప్రియవిషయకాలాపశ్రవణముచే ఆమెమనమున లజ్జ కలిగినది. దానివలన తనలో నేమి సాత్త్వికభావములు ప్రకటములగునో - అవి పెద్దల మనస్సున కేమనిపించునో; వానిని గోపనము చేసికొనవలెను. అందులకై తాను వ్యాపారాంతర ప్రవృత్తురాలగుట యావశ్యకము. అదియే ఈలీలాకమలపత్రగణనమునకు హేతువు. ఈవిషయమును వెనుక వెనుకకు యోజించుచు పోయినప్పుడు పార్వతీచిత్తజనితలజ్జానామక సంచారిభావము ఈశ్లోకముచే ప్రతిపాద్యమగు ముఖ్యార్థము. ఏలయన అదియే యిచ్చట సహృదయచిత్తచమత్కృతిజనకము. కవిచే సాక్షాత్తుగా చెప్పబడనిది. పరోక్షముగా చెప్పబడినది. "పరోక్షప్రియా ఇవ హి దేవాః" ఇట్టి పరోక్షికోక్తులచే దేవతలు ప్రీతి నొందుదురట. ఇచట సహృదయులే ఆదేవతలు. లజ్జాఖ్య సంచారి భావము రసాంగము. కనుక ఇచటి ఈయుదాహరణము రసధ్వనికి సంబంధించినది.

"గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరి సాకుం దింత్రిణీ పల్లవో
త్కరముం గూడఁ బొరంటినూనియలతోఁ గట్టావికుట్టారుగో
గిరముల్మెక్కి, తమిం బసుల్పొలమువోఁ గ్రేపుల్మెయిన్నాక మే
కెరువుంగుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్."

( ఆముక్తమాల్యద - 4.131. )

అను పద్యమున రెడ్లదారిద్ర్యమును వస్తువు - క్రేపులు రెడ్లను తమ తల్లులుగా తలచిన భ్రాంతిమదలంకారము దాని మూలమున స్ఫురించు హాస్యరసము అనునవి ధ్వనులు.

ఇప్పుడు మరల పైవిషయముల నాలోచించవచ్చును. వైయాకరణుల స్ఫోటసిద్ధాంతమున శబ్దాత్మకధ్వని -- స్ఫోటము -- శబ్దప్రతిపాద్యార్థ ప్రతీతి

ధ్వనిసంప్రదాయవాదులగు అలంకారికుల మతమున

వ్యంకజమగు వాక్యము
లేదా
పదము
లేదా
పదాంశము | --వ్యంజనావ్యాపారము -- వ్యంగ్యార్థ ప్రతీతి

ఈవిధముగా స్ఫోట - ధ్వని సిద్ధాంతములకు సామ్యము కుదురుచున్నది.

ఈధ్వనిసిద్ధాంతమును శ్రీమన్మహాభారతమున కన్వయించుటయే ఈనిబంధమున ప్రతిపాద్యవిషయము. ఇట్టి విషయమునందు ప్రవేశించుటకే ఎంతయో యోగ్యత కావలయును. గురుకులసమాశ్రయణమున సంపాదించిన సంప్రదాయ పరిజ్ఞానము - తత్త్వజ్ఞాననిష్ఠ- దృఢపరిశ్రమము- అనహంకారతాపూర్వకమైన సహృదయత్వము - లేనిదే ఇట్టి విషయములందు నిష్కృష్టమైన పాండితి యలవడదు. దానిని నిర్దుష్టముగను, స్పష్టముగను, సరళముగను ప్రతిపాదించు సామర్థ్యమును అబ్బదు. శ్రీశర్మగారికి ఈపై సాధనసామగ్రి యంతయు సమగ్రమునగలదు. శ్రీవేమూరి రామబ్రహ్మశాస్త్రులవారు ఆంధ్రదేశమునందు జన్మించి, భారతదేశమునందలి సుప్రసిద్ధ విద్వద్వరేణ్యుల కెవ్వరికిని తీసిపోని కూలంకష పాండితి కలిగియుండియు - మారుమూల నెచ్చటనో - అగిరిపల్లిలో చాల కాలమును చివర చివర ఒంగోలులో కొంతకాలమును శాస్త్రపాఠప్రవచనములతో కాలముగడిపిన మహానుభావులు. వారికి రాని శాస్త్రములేదు. అసమగ్రత యనునది వారి పాండితిలో నెచ్చటను కానరాదు. వేదభాష్యములు - మీమాంసాశాస్త్రమున అర్థసంగ్రహము మొదలు శాబరభాష్య - శ్లోక - తంత్ర - వార్తికముల వరకు అన్ని గ్రంథములును వ్యాకరణశాస్త్రమున మంజూషాభూషణసారాదికము - అలంకారశాస్త్రమున అన్ని గ్రంథములును - వేదాంతశాస్త్రమున అద్వైతపరిభాష మొదలు ఖండన ఖండఖాద్యము వరకు నన్నియును తర్కశాస్త్రమున నన్నిగ్రంథములును నిరాఘాటముగ ననేకావృత్తులు పాఠములు ప్రవచించి పండిన పాండితి కల వారిని గూర్చి ఏదో చెప్పబూనుట సాహసము, వారి శిష్యకోటిలో కడపటివారు శ్రీరామచంద్రుల కోటీశ్వరశర్మగారు న్యాయ వేదాంతాద్యనేకశాస్త్ర పారంగతులు. వారినుండి సంపాదించిన సంప్రదాయబద్ధ మగు శాస్త్రీయాలోచనా సరణి శ్రీశర్మగారిది. ఇట్టి వీరిచే సంగ్రథింపబడిన ఈనిబంధము మూలమున ధ్వన్యా చార్యుని ధ్వన్యాలోకమును శ్రీమన్మహాభారతమువంటి ఆర్షగ్రంథముపై నన్వయించుటలోను - దాని నొక సరసకావ్యవముగా భావనచేసి ఆనందించుటలోను - సహృదయులకు తోడుపడుట అను

రెండు ప్రయోజనములు చక్కగా నెరవేరగలవు. ఈబృహత్ప్రయోజనమును సిద్ధింపజేయుటలో ఇది నిష్కృష్టముగ నుపయోగించు సాధనమగుటచే నిదియంతయుగాని. దీని యందలి ప్రత్యేకవ్యాసములేకాని ప్రత్యేకము సమగ్ర గ్రంథముగా పఠన - పాఠనములలో గ్రహింపబడినచో భారతీయాలంకారికభావనాసరణిసంప్రదాయ మవిచ్ఛిన్నముగ ఆంధ్రదేశమున ముందునకు సాగిపోవుచుండునని నిశ్చయముగ చెప్పవచ్చును. ఇందతిశయోక్తి లేశమాత్రమును లేదు.

ధ్వన్యాలోకమునకు వివరణములో - అనువాదములో - ఇతఃపూర్వము పెద్ద లెందరో రచించినవి కలవు. కాని ఈనిబంధరచయిత ధ్వన్యాలోకమును చూచిన తీరు - అన్వయించుకొనిన విధము - తనది. దీనిని వినియోగించుకొన గలుగుట ఆంధ్రసాహితీతత్త్వజిజ్ఞాసువులగు సహృదయులవంతు.

ఆదోని
ది 26-9-1979

పాతూరి సీతారామాంజనేయులు